# సౌందర్యం

సౌందర్యం ఆనందానికి మూలకందం. ఆనంద రూపమైన బ్రహ్మకూడా "సత్యం శివంసుందరమ్" అని అందుకే అఖ్యాతం. ప్రకృతిలో చరించే జీవయాత్రికుడు చూచే సుందరరూపం ఏమి ఉపకారం చేస్తుందతనికి?

సుందర వస్తువు నిత్య సంతోషదాయకం. ప్రేమను పెంపుచేస్తుందది. ఎన్నటికీ శూన్యం కాలేదు. ప్రత్యేక ప్రశాంతనికుంజంగానూ మధుర స్వప్నమయనిద్రగానూ, సుఖారోగ్య నిశ్వాసంగానూ మనజీవితాన్ని వెంబడించేఉంటుంది" ఇది కీట్సుఅను ఆంగ్లకవి సౌందర్యాన్నిగురించి చెప్పినది. లోకములోని సమీకరణంలో దెబ్బలెన్ని తింటూ ఉన్నా,

in spite of all,
some shape of beauty moves
away the pall from our dark
spirits.

ఏదో సుందరాకృతి, మన అంధాత్మలనుంచి దుఃఖావళిని తుడిచివేస్తుంటుంది.

సుందరమైన పదార్థాన్ని చూసినపుడు చూచాడు అంటాం.

"సుందరం" అనే పదానికి "సత్య" పదంకూడా మిళితం కావాలి. అప్పుడు "సత్యసుందరం" అవుతుంది.

ఎక్కడ ఉంటుంది ఈ సత్యసౌందర్యం?

'True beauty dwells in deep retreats whose veil is unremoved till heart with heart in concord beats and the lover is belove'd--Words worth.

"సత్యసౌందర్యం" అగాధంలో నిగూఢంగా ఉంటుంది. దానిపై ఆవృతమయ్యే మేలిముసుగు ఆత్మతో ఆత్మఐక్యత అయ్యేపర్యంతం తొలగింపబడదు. అవిస్మృత ప్రేమ ప్రేమికం ఒకటే.'

"సౌందర్యం" అనే విషయంలో పోనుపోవడం కద్దు లోకం అనేకపర్యాయాలు. కారణం— అగాధంలోకి అత్మదృష్టులను చొరనిచ్చే శ్రమకు పాల్పడకనూ, సౌందర్యం అంటే అసలు అంతస్సంబంధి కాదనే భ్రమవల్లనూ.

'O beauty, find the self in love, not in the flattery of the mirror.' -Tagore.

"ఓ సౌందర్యమా! ప్రేమలో నిగూఢమైయున్న నిన్ను నీవు తెలుసుకో గాని ముఖస్తోత్రంతో మోసపుచ్చే ముకురంలో కాదుసుమా."

ఇటువంటి సత్యసుందరమైంది మనకు "శివమ్" మంగళం కూరుస్తుంది. కాబట్టి సత్యం శివమ్ సుందరమ్ అనే వాక్యాన్ని ప్రకృతిలో సమన్వయం చేసి జగత్ప్రమోదం ఆత్మ ప్రమోదం కూడా సమకూర్చే నిమిత్తం కలమెత్తుతాడు కవికుమారుడు

"జగన్మిథ్య" అని కత్తులెత్తబోకండి వేదాంతులారా!

పరమసత్యాన్నిగూర్చి తరచిన పూర్వులు ఉన్నారు. అధునికులు ఉన్నారు. అందరి మార్గాలను పరిశీలించి అరవిందయోగి సర్వమతాలకూ సంవాదం సాధించమని కృత్స్నదృష్టి అవలంబించి దివ్య పరిణామవాదాన్ని ప్రసాదించాడు. అది ఐక్యమునే నిజమని స్వీకరించి బహుత్వమును కల్ల అనదు నిష్కృష్టమే పరమార్థమని ప్రవృత్తి భ్రాంతిఅనదు.

అందువల్లనే అరవిందయోగం ప్రపంచ సౌందర్యమైముఖ్యాన్ని మనకు కలిగించకుండదు.

"నీవే జగత్తులో నన్ను ప్రతిష్ఠించావో దాన్ని నేను ప్రేమింతునోయని గ్రహించుటలేక కదూ నీప్రేమ నాపై ప్రభూ!

అని రామాయకవి స్తుతిగీతి.

దివ్యసుందరమూర్తియైన శ్రీకృష్ణుడు చేసిన మురళీగానంలో ఆత్మారావం అనందడోలలనూపిందంటేను లోకం నాదు తరించిందంటేనూ రహస్యం ఏందో పైవాక్యాలవల్ల తెలిసే ఉంటుంది.

ప్రకృతిలోని అనంతవస్తుజాలాన్ని చూస్తాడు పురుడు అతనికి సౌందర్యం ఎక్కడ గోచరించినా చివరకు స్త్రీ ప్రకృతిలో పర్యవసితమౌతున్నది. "స్త్రీవస్తు" ని ఉద్బోధచేసేవాడికికూడా స్త్రీ అవసరం. మనుకుకు మోక్షకాంతా సాహచర్యం కావాలంటాడు విరాగి. "అద్వై"లో ప్రేమ–ప్రేమః ప్రేమ– అని పోషణచేసిన నాయికా నాయకులు ఎరక్కుండానే ప్రేమలోకిపోవడం ఆశ్చర్యం! "ప్రేమసాగర్ కాకుండా ఉండాలె అద్వై" అనే బోధను చేసి అకథలోనుంచి కొసరిని తొలగిస్తే కథకూన్యం. సౌందర్యరాశి కొసరి. దాన్ని అరాధించే వాసేదారు జీవితం హానిని ఎటువ్యూహమున్నా అతివందరసం అనుభవిస్తూ జీవితశేషాన్ని నిల్పుకొనిఉంటాడు

మనుగుపరచక ఆత్మవంచనలేక ప్రతిమానవుడు తనహృదయంలోకి దృష్టి పెట్టిచూచుకుంటే తనకు సౌందర్యంఅంటే ఎప్పుడు ఎట్లాగోచరించిందీ వ్యక్తమౌతుంది. లోకానికి చెప్పొద్దు. స్మృతికి తెప్పుకుంటే చాలు.

"సత్యసౌందర్యం"— ఈమాటలో పొరపడవద్దు. ఇదిహృదయైకవేద్యం ఒకడికి ఒక తీరు ఇంకొకడికితలితకాలం. 'sensation' లోని (ఐంద్రియము) లోనిభేదాలు.

ఒకఅంధుడు క్షుధార్తుడు త్రోవప్రక్కనపడి ఉంటూవున్నాడు. ఎందరో చూచారు. అయ్యో అంటూపోయినారు. ఒకడు అయ్యోఅనకుండానే చూచే చూట్టంతో తన ఇంటికి తీసుకొనిపోయి పరిచర్యలుచేసి పెంచుతాడు.

Sensation లోని gradation తరతమభావము ఇటువంటిది, కాబట్టి సత్యానికి ప్రవృత్తిని ఆశించలేము. అది Natural gift. కాని ఆ బీజం సూక్ష్మంగానైనా ప్రతి ప్రకృతిలో ఉంటుంది. సౌందర్యం ప్రేమకు మూలం. స్త్రీ ప్రకృతి దానికి స్థానం. అందుకనే Ottway

Oh woman! lovely woman. nature made thee to temper man; we had been bruters without yo. Angels are Painted fa'r, to look like you; There is in you all that we believe of heaven, Amazing brightness, purity truth; eternal joy and everlasting love.

"వనితా! ప్రేమమయీ! పురుషుణ్ణి నియమించడానికి నీవు ప్రకృతిచే సృజింపబడ్డావు. నీవులేక మేము మృగాలము. నీవలెఉండాలని దేవతలు అందమైన రంగులు వేసుకుంటారు మేము ఊహించే స్వర్గమాధురి నీలో ఉన్నది. అద్భుతమైన ప్రకాశం, నైర్మల్యం, సత్యం, నిత్యసంతోషం, శాశ్వతప్రేమ."

"మనుజాండేమయి రొట్టుపోవుకోకదా మా ధుర్యభావాత్మ్యమైనను కాంతాములు లుంఠకుండిన నిజ్జ్యా పద్మభవముల్ మాని మర్దనుడై ఘాతుక సత్వమత్తుల నహోరాత్రంబులు గ్రొరవర్తనమే కృత్తిగ కర్కశాత్ముడవు నిందంబొంద నేమౌ—

ప్రేమకు కేంద్రస్థానము
తై మెలతలు కటికవాని యాత్మను నైనం
గోమల కరుణాంకూర
స్తోమము పుట్టింపగలరు శుభ్ర ప్రకృతులే—
దువ్వూరి రామిరెడ్డి.

అందువల్లనే కావ్యం కాంతా సమ్మితం కావలెనని లాక్షణికుల నిర్దేశం. సత్యసౌందర్యాన్ని మభ్యపరచి బాహ్యంగా మేరలుదాటిపోయిన కావ్యాలు చూచి నాగరికులు సహించలేరు. నిజం. వాటికేవో కారణాలుఉండే ఉంటవి. అన్యదాకులై ఆట్లారదించి ఉంటారు వాళ్లను తృప్తిపరచడానికి

కవి ఒద్దనుకొనప్పుడు నిత్యోపాదంచేసి True beautyని మన కందిస్తాడు.

కాళిదాసు రఘువంశములో ఇంద్రుమతీవిరాట్రంని నిర్మించినఘట్టం అమృతం వర్షించింది. వ్యాఖ్యాంధ్రుల కావ్యరీతులు కాళిదాసుని ప్రతిబింబాలుగా నాకగపడతవి.

వస్తువునుంచి భావం, సుందరవస్తువునుంచి సుందరభావం. అప్పుడు జగత్ప్రమోదం సిద్ధిస్తుంది, కాబట్టి అలా టను అనుసరిస్తాడు కవి

We must rise from form to the idea.- Plato.

సౌందర్యమే ప్రేమకుదారి. ప్రేమనుగురించి ఇంకో సారి,

అంబటిపూడి వెంకటరత్నం

---







## చందాదారులకు మనవి

[illegible]

మేనేజరు, గోలకొండపత్రిక.

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర ఫాల్గుణ బ॥ ౪

సోమవారము

## హితవాక్యము

రాజా వేంకటరామారెడ్డి బహద్దరు గారు సర్వజనమాన్యులు. అన్నిమతాల వారికిని అన్ని వర్గాలవారికిని సమాన ప్రీతి పాత్రులు. వయోవృద్ధులు. అఖండానుభవ సంపన్నులు. విజ్ఞులు. ౫౫సంవత్సరాలు ఏకథాటిగా ప్రభుత్వోద్యోగము చేసినారు. అన్నిజిల్లాలలోను ఉద్యోగము నిర్వహించినారు. రాష్ట్రములోని అన్ని భాషలను నేర్చినారు. ప్రభువులకును ప్రజలకును సమానముగా కావలసినవారు. నిష్కల్మష హృదయులు. ప్రభుభక్తి పరాయణులు. అట్టివారిమాటలు అందరికిని పథ్యమైయుండుటలో చిత్రమేమియు లేదు.

గతవారము మహబూబునగరులోని బాలసరస్వతీ గ్రంథాలయ శంకుస్థాపన వారి సిద్ధహస్తముచేత కావింపబడినది. సిద్ధహస్తమనుట యెందుకనగా, వారు ప్రారంభించిన యేకార్యముకూడ ఇంతవరకు విఘ్నముపొందలేదు. రెడ్డివిద్యార్థిగృహము, బాలికల ఉన్నతపాఠశాల, బాలికల వసతిగృహము వీరి పర్యాలోకనములోనే సిద్ధమై వృద్ధిపొందుచు వచ్చినవి.

మహబూబునగరు గ్రంథాలయసభలో శ్రీరెడ్డిగారు ప్రస్తుత దేశీయపరిస్థితులనుగురించి ముచ్చటించిరి. ఈమధ్య మతకల్లోలా లెక్కువైనవని వారుతమ విచారమును వెల్లడించిరి. ప్రభుత్వోద్యోగులు కల్లోలములను నిరోధించి శాంతిని కాపాడుటలో ముఖ్యబాధ్యతవహించినవారుగా నుండవలెనని సెలవిచ్చిరి అధికారులు న్యాయమును, సత్యమును అవలంబించి ఏవర్గపక్షపాతమును లేనివారుగా ఉండినచో ఏకల్లోలాలును కలుగజాలవని శ్రీరెడ్డిగారి అభిప్రాయముగా కనబడుచున్నది. ఈమతకల్లోల రోగనిదానమును తెల్పుటకు శ్రీరెడ్డిగారికి అన్నివిధాలా అధికారముకలదు. శ్రీవారుచేసిన ౫౫ఏండ్లఉద్యోగ కాలములో వారెచ్చటెచ్చట ఉద్యోగము చేసిరో అచ్చటచ్చట శాంతిని బాగుగా కాపాడినారని వారి జీవితచరిత్రను చదివిన ఆంధ్రులకందరకును బాగుగా తెలియను. హైద్రాబాదు నగరములో వారు సుమారు ౧౫ఏండ్లు కొత్వాలు పదవిపై ఉద్యోగముచేసిరి. ఆకాలములో ఒక్కనాడుకూడ నగరమందు మత కలహము కలిగియుండలేదు. అది సామాన్యవిషయము గాదు. వారికాలములో కలహములకు అవకాశము లేకుండెనని చెప్పజాలము. కొన్నిమారులు అట్టిపరిస్థితులేర్పడు సూచనలు కనబడగానే వారు జాగరూకతతో, చాకచక్యములో వాటిని సంభవింపకుండ జేసిరి. వారుఅమీనుగా నుండుకాలములోకూడ వారి తాలూకాలలో హిందూముస్లిం సంఘర్షణ లేర్పడు సూచనలు కలిగినప్పుడు వారు శ్రద్ధతో శ్రమచేసి ఉభయవర్గాలకును మైత్రినికలిగించిరి. అట్టి అనుభవజ్ఞులైన ఉద్యోగులుచెప్పిన వాక్యాలవిలువచాల హెచ్చు. ఉద్యోగులపై వారు గొప్పభారముంచినారు. అది సమంజసమే. ఉద్యోగులు శ్రీవారు సెలవిచ్చినట్లుగా న్యాయబుద్ధి కలిగి, నిష్పక్షపాతము కలవారైయుండురేని మతకల్లోలాలకు అవకాశములు చాలతక్కువగానుండును.

ఉద్యోగులు ప్రజలసేవకులు అనిశ్రీవారు సెలవిచ్చినారు. ఇందేమాత్రమును అతిశయోక్తి లేదు. ఆభావన యుద్యోగులందరిలో — చిన్నవారిలోను పెద్దవారిలోను— బాగుగా ప్రబలవలెను. ఉద్యోగులు, ప్రజలుతరుచుగా కలియుచుండవలెను అనియు రెడ్డిగారు సెలవిచ్చినారు. శ్రీరెడ్డిగారు పట్టుపీతాంబరాల వారిని, గొంగడివారిని, మోటార్లవారిని, ఎద్దులబండ్లవారిని దగ్గరకుతీసినారు. బీదవారల నిరసింపలేదు. పెద్దవారికి గౌరవలోపము కలిగించలేదు. గొప్పపోలీసు ఉద్యోగులైనను అతిదరిద్రులకుకూడ అతిసులభముగా దర్శనమిచ్చి వారిమనవిని శ్రద్ధతోవిని వారికి న్యాయముచే ప్రసాదించుచుండిరి. అందుచేత ఎటువంటి వాడైనను శ్రీరెడ్డిగారి సన్నిధిలోకి వెళ్ళుచుండిరి. ఇతరాధికారులును అదేవిధముగా ప్రజలను ఆదరించితే ప్రజలువారిదగ్గరికి పోనతటిమూర్ఖులుకారు.

రాజాబహద్దరుగారు సెలవిచ్చిన వాక్యాలు ఎక్కువగా అధికారులకే సంబంధించినవికాన అధికారులైనవారు వారి హితవాక్యాలను దృష్టిలో నుంచుకొని శ్రీరెడ్డిగారివలెనే సర్వజనప్రియులై కీర్తి నిగడించి దేశసేవను, ప్రభుసేవను బాగుగా చేయుదురుగాక.

---

## బెంగాలు ప్రధానిపై మానసష్టం దావాకొరకు నోటీసు

కలకత్తా చీపుప్రెసిడెన్సీ మెజస్ట్రేటు ఉత్తరువు

కలకత్తా, మార్చి౧౪

బెంగాలు పధాని గౌ॥ఏ కె. ఫజులులహక్కుగారు బెంగాలుశాసనశాసభ్యులలో చేసిన ప్రకటనలో బెంగాలుహిందూశాసనసభ్యులు వందకి మానభంగంకలిగేటట్టి మాటలుప్రయోగించారని ఆనంతరము కలకత్తాపత్రికలలో మార్చి౫వ తేది ప్రచురించబడినవి అద్వోకేటు పి యన్. ముఖర్జీగారుబెంగాలుప్రధానిమీద కలకత్తాఛీఫుప్రెసిడెన్సీ మేజిస్ట్రేటుకోర్టులో ఒకఫిర్యాదు దాఖలుచేసిరి దానిమీద మేజిస్ట్రేటుగారు హక్కుగారికినోటీసు స్వయముగాగాని ప్లీడరుద్వారాగాని హాజరై వారెందుకు నేరముచేయరాదో సమాధానంచెప్పుకోవలసినదిగాకోరిరి.

కేసుమార్చి౧౭కు వాయిదావేసిరి. ఈఫిర్యాదు పైతిప్పరువుచేసే సమయంలో కోర్టుఅంతా వకీళ్లతోను, జనంతోను క్రిక్కిరిసియుండెను

---

## తాయిలాండు ఇండోచైనాలకు ఒడంబడికకుదురుట

### ఆసియాఖండపు తూర్పుకొనపరిస్థితులు

ఆసియాఖండపుతూర్పుకొనలో జపానుచర్యలచే ఇంకముందరకిని జాగ్రత్తకలిగియుండవలెననిపించుచున్నది. తాయిలాండు (ఫ్రెంచిఇండోచైనాల వివాదంవిషయంలో జపానువారు మధ్యవర్తులై చేసినసూచనలలో ప్రధానాంశములన్నింటికిని తాయిలాండు, ఫ్రెంచిప్రభుత్వములు మార్చి ౬ వతేదివాటికి అంగీకరించినవి. ఇక చిల్లర అంశములనుగూర్చి రాయభారములుజరుగవలెను. ఈఒడంబడికకుదిరినసగతి తాయిలాండుకువాద్దనేవేలను అవలనుండే తాయిలాండుసేనలకును ఫ్రెంచిసేనలకును తెలియజేయబడినది అందువలయుద్ధమునుఆపియుంచుటకై ఒప్పుకొనబడినది మార్చి ౭ వతేదివారితో ఆంతిమైనను ఆయుధముతో కలియబడి పోరాడుకొను పరిస్థితుల పూర్వపరిస్థితులు ఇప్పుడుతగ్గును ఎవరోఒకపక్షమువారు తిరస్కరించేఉద్దేశ్యము కలదని కొంతమంది పోరాడవలెనుచేయబడినది ఆసియాఖండపు తూర్పుప్రాంతంలో (ఫ్రెంచినాశాగకమిప్పుడు కృషిచేయుబడినది (ఫ్రెంచిప్రభుత్వమువారు జపానుసూచనలను అంగీకరించుట్లు అర్థముచేసేవారు ఇందువల్ల తాయిలాండు ఇండోచైనాలవివాద ముపూర్తియైనను. ఆసియాఖండపు తూర్పుప్రాంతములో శాంతి నిర్ణయమైనటికాలేదని కొందరుచెప్పుచున్నారు కారణమేమనగా జపానువారి కృషివల్ల జపానుసేనలు మలయా, బర్మా అసరిహద్దువరకు రాగలరనుకున్నారు అందువల్ల బ్రిటిషువారు ఆప్రాంతంలో తమసామ్రాజ్యభాగాల రక్షణకై జాగ్రత్తపడుచున్నారు

౧౦౦ జపానుయుద్ధనౌకలు మార్చి ౫ వతేదిలోపల దక్షిణచైనాలోని ద్వీపసముదాయము చేరినట్లు వార్తవచ్చినది అట్లుచేరినవి టిలో కొన్ని దక్షిణపసిఫిక సముద్రప్రాంతానికి పోయినవి

జపానుసేనలు కొన్ని ఇండోచైనాసరిహద్దునుండి ౨౦ మైళ్ళదూరంలోనుండే టూన్యకే అను సముద్రశాఖలోనుండే పాకాయిని మార్చి ౪ వతేదివేకువన ఆక్రమించినవి. పాకాయికి తూర్పునుండే ముఖ్యస్థలములనుకూడ ఆక్రమించినవి. ఆగష్టు వ సంవత్సరంలో జపానుసేనలిట్లే దక్షిణచైనాలోని క్వాంగ్సీరాష్ట్రంలోకి పోయి ౧౯౪౦ లో మరలఖాళీచేసియుండెను. అప్పటినుండి మరలజపానుతో పోరాడుచున్న చైనీయప్రభుత్వానికి పాకాయిమీదుగా క్వాంగ్సీరాష్ట్రంలోగుండా సహాయముపోవుచుండెను అందువల్ల అట్లుపోయుమును పోకుండచేయుటకై మరలఇప్పుడు జపానుసేనలువచ్చి దిగినవి. వాంగ్‌చిఙ్‌దగ్గర సేనలనుదించుటకు యత్నించుచుండిన ఒకజపానీయయుద్ధనౌక చైనీయుల ఫిరంగులప్రయోగముచేమార్చి ౪ వతేదివేకువజాముననుంచి వేయబడినది. ౧౯౪౦ వసంవత్సరంలో ఈవిధముగా ౧౯ జపానీయనావలు చైనీయులచే ముంచివేయబడినవి, ౧౫ జపానీయనావలు చెడగొట్టబడినవి.

బర్మాలో బ్రిటిషువారికిసహాయంగా చైనాసేనలుపంపబడియున్నట్లు ఒకవదంతిలేచెను జపానులోని బ్రిటిషురాయబారియగు సర్ రాబర్టుక్రెయిగీగారు అది అసత్యమనిమార్చి ౪ వతేదిన జపానీయవిదేశాంగశాఖ కేఉపమంత్రికి తెల్పినారు. అట్లు బర్మాలోకి చైనీయసేనలను రప్పించుటకు రహస్యసంధిఏదియును బ్రిటనుచైనాలమధ్య ఏర్పడియుండలేదనిఖూడవారుచెప్పిరి. ఐతే లోకికప్పోదలచినచైనీయులు ఇకమీద చైనాప్రభుత్వ విదేశాంగశాఖనుండిగాని, చైనాలోని బ్రిటిషురాయబారి కార్యాలయమునుండిగాని అనుమతిపత్రాలు పొందవలెనని చైనాప్రభుత్వమువారు ఆజ్ఞాపించినారు.

చైనాప్రధానకరము చంకింగులో జాతీయ ప్రజలరాజకీయసభలో మార్చి ౬వతేదిన మార్షల్ చియాంగ్ కాయిషేక్‌గారుపన్యసించుచు రష్యా, అమెరికా, బ్రిటను, చైనాయొక్క ఎట్టివిధానమును సమర్థించినను జపానుప్రతిఘటనకు అటంకము కలిగించుననిచెప్పిరి, చైనా ప్రభుత్వఆర్థికమంత్రి కార్యదర్శియగు ఏ టి. చెంగ్‌గారు మార్చి ౫వతేదిన రంగూనులో పత్రికావిలేఖరులతో సంభాషించుచు చైనా జపానులయుద్ధము యుద్ధరంగంలోకంటె ఆర్థికరంగంలోనే తేలునని చెప్పిరి. వాలగేండ్ల యుద్ధమైనా చైనా పసపత బ్రిటను, అమెరికా రష్యాల సాయకట్టిగానున్నదనిరి.

జపానువిదేశాంగమంత్రి మాత్సుఓకాగారు ఫిబ్రవరి ౨౪వతేది చర్చిలుగారికి పంపినటిసందేశములో జపానువారు శాంతికిపాటుపడగలరని తెలిపియుండిరి. దానివిషయంలో బ్రిటిషుప్రభుత్వమువారు తమకు జర్మనీతోజరుగుచుండేయుద్ధంలో జపాను మధ్యవర్తిత్వముచేయునని అర్థంచేసుకొనిరి. అదిజపాను అభిప్రాయముకాదని మాత్సుఓకాగారిదివరలో ప్రకటించిరి, దానివిషయంలోనే కలిగినపొరపాటు అభిప్రాయములతొలగించుటకై అందులో జపానురాయబారి మార్చి ౪వతేదినరాత్రి బ్రిటిషు ప్రధాని చర్చిల్‌గారితో సంభాషించి, మత్సుఓకానుండి వచ్చిన సందేశమునుఇచ్చిరి.

ఆస్ట్రేలియాప్రధాని మెంజీస్‌గారు గతవారంలో లండనులోఉపన్యసించుచు, ఆసియాఖండపుతూర్పుప్రాంతంలో శాంతంగానరిష్కారం కాజాలనిచిక్కేమి ఉదయించలేదని చెప్పియుండిరికదా! ఇదిజపానును సంతృప్తిపరచజాలుట మెత్తదనమునిపించుచున్నదని ఆక్షేపించినారు. అందుపై మెంజీస్‌గారు మార్చి౫వతేదిన అట్టిమెత్తదనముతోనుద్దేశించిన అభిప్రాయము మెంతమాత్రము కాదనివారు మెంజీస్‌గారికింతక్రము మార్చి౪వతేదిన ఆస్ట్రేలియాలోని జపానురాయబారి మెంజీస్‌గారి ప్రకటనచాలాబాగున్నది. అందులోచెప్పినప్రకారము ఆస్ట్రేలియాజపానులు పరస్పరగౌరవముతో ఒకఒడంబడికచేసుకొనవలెనని చెప్పుటవల్లకలిగినది.

---

## భారత శాసనసభ

### ఉపయెన్నికలలో కాంగ్రెసు విజయము

కాశి, మార్చి౫:

భారతశాసనసభకు బెనారెసు- గోరఖ్పూరు నియోజకవర్గమునుంచి జరిగిన ఉపయెన్నికలలో కాంగ్రెసుఅభ్యర్థి శ్రీదనాలుగారు గెలిచినట్లు ప్రకటించిరి. వారికి ౭,౫౦౨వోట్లువచ్చినవి, రాయబహదూరుమధురాదనసాహుగారికి౯౭౭, రామరతన్‌గుప్తగారికి౭, సుఖరాంగారికి౪వచ్చినవి, ౨౩వోట్లుపనికిరాలేదు మొత్తంవోట్లు౭౩౩౬,

---

## గోపాలుపేట సంస్థానపు అవకతవకలు

(స్వ-వి)

ఈసంస్థానములో హిందీపాఠశాల రాతీగా ప్రోత్సహమువల్ల జరుపబడుచుండెను విద్యార్థులు ౨౫ వరకుండిరి-కొందరు ప్రాథమికమధ్యమపరీక్షలుకూడ నిచ్చినవారుండిరి తాలుక్దారుగారుపాఠశాలనాపినారు-

ఇచ్చటఒకగ్రంథాలయము స్థాపించికొందరు జ్ఞానులు కొన్నిపత్రికలను తెప్పించి చదువుచుండిరి, ఒక సమావేశము గ్రంథాలయమునందు జరుగుటమాని ఇట్టిస్థితిలో కాంగ్రెసుకు సంబంధించగలదని ఆపి వేసిరి.

క్రొత్తపాఠశాల అమర్చబడింది పూర్వపురీతిగానే ప్రాథమికపాఠశాల లేర్పాటుచేసినారు, ఇందులోఆయుధవ, ఆరవతరగతిప్యాసుఅయినవారే టీచర్లుగానపనిచేయుచున్నారు మాధ్యమిక పాఠశాల ఎప్పుడు ఏర్పాటుగునో?

---

## నిజాంరాష్ట్రపద్మశాలియువజన సంఘం

హైదరాబాదు మార్చి ౧౪

"అఖిలభారత పద్మశాలియుకార్యాధ్యక్షులైన శ్రీయుత గుంటకసరస్వయ్యపంతులుగారి ధర్మపత్ని (౯-౩-౧౯౪౧) ఆకాలమరణమునకు ఈ సంఘమువారు అపరిమితమైన దుఃఖమువెల్లడించుచు, పద్మశాలిజాతీయులకు వారికిలోమగల మృత్యుకు పరమాత్ముడు శాంతిప్రసాదించుగాక మరియు శ్రీవారికిగలిగిన భార్యావియోగదుఃఖమును పరమేశ్వరుడుతొలగించి సహనశక్తినొసంగుగాకయని సీసంఘమువారు నిరంతరము ప్రార్థించుచున్నారు" అనుతీర్మానము నిజాంరాష్ట్రపద్మశాలి యువజనసంఘమువారిచే చేయబడినది.

---

## పతాకవందనము

హైదరాబాదు మార్చి ౧౪

కాచిగూడెం ఆర్యసమాజంలో నిన్నగురువారం ఉదయము ౯ గంటలకు శ్రీ-ప. దత్తగారు ధ్వజారోహణంచేసిరి. శ్రీ.ప.శేర్‌సింగుగారు కేశవు మెమోరియల్ స్కూల్ ప్రధానోపాధ్యాయుడు గారి ఉపన్యాసమునిచ్చెను. తరువాత సమయమున వృందముసామ్రాట్ పండితవరేంద్రజీగారు "ఓంపతాకవందనముచేసిరి.

---

## ఇంతవరకు కాంగ్రెసు సత్యాగ్రహోద్యమపు నడక

### దేశంమొత్తంమీద ౪౨౪౯ అరెస్టులు

### రెండులక్షలకుపైగా జుర్మానాలు

ఇంతవరకు కాంగ్రెసు సత్యాగ్రహోద్యములో దేశమంతటను అరెస్టయినవారిసంఖ్య ౪,౨౪౯ అనియు సత్యాగ్రహులకువిధింపబడిన జుర్మానాల మొత్తము రు.౨,౦౯,౬౬౨ అనియు అఖిలభారత కాంగ్రెసుపరిషత్తు కార్యాలయానికి వేరువేరు రాష్ట్రములనుండి చేరినవివరాలవల్ల తెలియుచున్నది- ఈఅరెస్టుల మొత్తములోగాని, జుర్మానాల మొత్తములోగాని పంజాబురాష్ట్రంలో అరెస్టయినవారిసంఖ్యయు, అక్కడవిధింపబడిన జుర్మానాలమొత్తమును చేర్చబడలేదు- అక్కడివివరాలు ఇంకను తెలియరాలేదు-

అరెస్టయిన సత్యాగ్రహులసంఖ్యనుబట్టిచూడగా, సంయుక్తరాష్ట్రము మొట్టమొదటిదగును-

ఆతరువాతి మధ్యభాగంపరకి అక్కడ అరెస్టయినవారిసంఖ్య ౧,౪౯౫-జుర్మానాల మొత్తమునుబట్టిచూచినచో ఆంధ్రదేశము మొట్టమొదటిదగును-అక్కడిసత్యాగ్రహులకు విధింపబడిన జుర్మానాల మొత్తము రు౭౬,౫౩౩-

వివరములు

ఏయేరాష్ట్రములలో యెన్నిఅరెస్టులు జరిగినవో యెంతజుర్మానాలు విధింపబడినవో ఈక్రింద తెలుపబడినది-

| రాష్ట్రము | అరెస్టులు | జుర్మానాలు రూపాయిలు |
|---|---|---|
| అజ్మీరు | ౧౦ | ౫౬౫ |
| ఆంధ్ర | ౯౯౨ | ౭౬,౫౩౩ |
| అస్సాము | ౧౭౬ | ౩,౧౪౫ |
| బెంగాలు | ౩౯ | ౩,౬౨౫ |
| బీహారు | ౨౮౨ | ౪, ౩౪౦ |
| బొంబాయి | ౪౭ | సమాచారం అందలేదు |
| ఢిల్లీ | ౩౯ | ౨౦౫౦ |
| గుజరాతు | ౨౯౬ | ౬,౧౫౦ |
| కర్ణాటక | ౨౧౭ | ౫,౩౯౫ |
| కేరళ | ౭౦ | ౫౪౦౦ |
| మహాకోసల | ౧౩౭ | ౧౦౩౦౨ |
| మహారాష్ట్ర | ౨౨౧ | ౧౯౧౫ |
| నాగపూర్ | ౨౧ | ౫౨౧౫ |
| వాయవ్య సరిహద్దు రాష్ట్రము | ౨ ఇప్పుడు విడుదలైరి. | ఏమిలేదు |
| తమిళనాడు | ౮౨౮ | ౨౯,౦౩౦ |
| సంయుక్త రాష్ట్రము | ౧,౪౯౫ | ౩౯,౦౦౦ |
| ఉత్కళ | ౩౧౫ | ౯,౫౩౨ |
| సింధు | ౧౨౩ | ౭,౧౭౬ |
| మొత్తము | ౪,౨౪౯ | ౨౦౯,౬౬౨ |

# అయోధ్యరాజా విజయము

లక్నో, మార్చి౹౫.

ఫైజాబాదుమహమ్మదీయేతర నియోజకవర్గము నుంచిభారతశాసనసభ ఉపయెన్నికలో అయోధ్య రాజాగారు గెల్చిరి. ప్రత్యర్థికాంగ్రెసుఅభ్యర్థి గోపాలనారాయణ సాక్సేనా గారు ౧౫౧౧వోట్లు తేడాతోఓడిపోయిరి.

అయోధ్యరాజాగారికి ౩౬౦౮ వోట్లు, సాక్సేనా గారికి ౩౪౫౭వోట్లువచ్చినవి ౮౧౨వోట్లు పనికిరాలేదు—

## కాంగ్రెసేతరులకు అనుమతి

కలకత్తా మార్చి౹౫.

"ఇదివరలో కాంగ్రెసుసభ్యులు కాని వారు కూడాఇప్పుడు కాంగ్రెసువిధానాన్ని అంగీకరించి సామాన్యసభ్యులుగా చేరేటట్లయితే, వారుసత్యాగ్రహంచేయుటకు అభ్యంతరంలేదు" అని మహాత్మాగాంధీగారికార్యదర్శిఅయిన మహాదేవదేశాయిగారు బెంగాల్ రాష్ట్రకాంగ్రెసుసంఘానికివ్రాసిన లేఖ తెలియచేసినారు

కాంగ్రెసుసభ్యులు గావుండుటకు నిరాకరించినవారిని సత్యాగ్రహులుగా చేర్చుకొనవచ్చునా అని, నిర్బంధాజ్ఞలలో వున్నవారు సత్యాగ్రహం చెయ్యవచ్చునా అని బెంగాల్ రాష్ట్ర కాంగ్రెసు సంఘంవారు గాంధీజీకివ్రాసిరి, నిర్బంధాజ్ఞలలో వున్నవారు సత్యాగ్రహంచేస్తే ఆజ్ఞ ఉల్లంఘించినందుకే కేసులు మోపుదురుగాని సత్యాగ్రహం చేసినట్లుగా కేసులుమోపరనికూడా గాంధీజీకి సూచనచేసిరి ఇందుపైన మహాదేవదేశాయిగారి వద్దనుంచిసమాధానంవచ్చింది,

నిర్బంధంలోవున్నవారు సత్యాగ్రహం చేయరాదని దేశాయిగారిఉత్తరంలో తెలియచేయబడినది.

# బ్రిటనులో కోడిగ్రుడ్ల తగ్గుదల

బ్రిటనుకు యుద్ధానికై మరికొన్ని నావలు కావలసివచ్చినందువల్ల ఓడలలో తెప్పించబడే కొన్ని సరకులను ఇకమీదట తెప్పించుటకు వీలుండదు కాబట్టి, పందిమాంసమును, కోడిగ్రుడ్లను ఇకమీద తక్కువగావాడవలసియుండునని బ్రిటిషు పార్లమెంటుకామన్సుసభలో మార్చి ౬ వ తేదిన వ్యవసాయశాఖామంత్రి ఆర్. యస్. హడ్సన్ గారుసూచించిరి.



# కాంగ్రెసుసత్యాగ్రహము

## బ్రిటిషుపార్లమెంటులో అమెరీగారికి సవాలు

మార్చి ౬ వ తేదిన బ్రిటిషుపార్లమెంటు కామన్సుసభలో ఇండియామంత్రియగు యల్.యస్. అమెరీగారు ఒకప్రశ్నకు సమాధానమిచ్చుచు, ఆయిదుగురు ప్రధానులతోసహా ౨౫ మందిపూర్వ మంత్రులు శిక్షననుభవించుచున్నారనియు, ఇద్దరుమాజీప్రధానులతోసహా ౦ మందిమాజీమంత్రులు అరెస్టుఅయియున్నారనియు చెప్పిరి. వీరలందరును భారతదేశంలో ఓటుహక్కుగలవారలచే ఎన్నుకొనబడినవారలు కాబట్టి, ఇట్టివారలను బంధించుటవల్ల అపఖ్యాతికలుగునుగనుక దీనినితప్పించుట కేమియత్నముచేయుచున్నారని సోరెన్సను అను లేబర్ పార్టీసభ్యుడు ఆమెరీగారినడిగెను. అందుకుఆమెరీగారు ఆమంత్రులందరును శాసనవిరుద్ధమైనచర్యలను చేసినందువల్ల అరెస్టు చేయబడినారనియు ప్రజలువారలను ఎన్నుకొనినవారను కారణంచే అట్టిశాసనవిరుద్ధచర్యలఫలితమును తప్పించవీలులేదనియు చెప్పిరి.

## సర్దారుసంపూర్ణసింగుగారికి మరలఅనుమతి

పంజాబు అసెంబ్లీలో కాంగ్రెసుపార్టీకి నాయకుడైన సర్దారు సంపూర్ణసింగుగారిదివరకు వకసారి సత్యాగ్రహంచేసిరి. అప్పుడుసింగుగారిమీద కేసుచేసినపుడు జిల్లామేజస్ట్రేటుకోర్టులో విచారణజరిగినప్పుడు సింగుగారొక స్టేటుమెంటునిచ్చిరి. దానిమీద మౌలానా అబుల్కలాంఆజాదుగారు సింగుగారిని అసెంబ్లీకాంగ్రెసుపార్టీ నాయకత్వంనుంచితొలగించిరి. సింగుగారీమధ్య వర్ధావెళ్లి గాంధిమహాత్మునితో మాట్లాడిరి. సింగుగారుమరలసత్యాగ్రహంచేయుటకు మహాత్ముడు అనుమతినిచ్చినాడు—సింగుగారు మరలవకసారి వర్ధావెళ్లి మహాత్మునితో మాట్లాడుదురు. ఆటుతరువాత వారే సత్యాగ్రహంచేస్తారు.

## జబ్బుగావున్నవారు సత్యాగ్రహం చెయ్యగూడదు

బీహారులో ఇదివరకు విద్యాశాఖామంత్రిగావుండిన డాక్టరు సయ్యదుమహమ్మదుగారికిప్పుడు జబ్బుగావున్నది. ఈమార్చినెల రెండవవారంలో తాముసత్యాగ్రహంచేయుటకు అనుమతినీయవలెనని మహమ్మదుగారు మహాత్మునకువ్రాసిరి—"జబ్బుగావున్నవారు సత్యాగ్రహంచేస్తే వారివల్లప్రభుత్వమువారికి చాలావ్యయప్రయాసలు కలుగును. జైయిలులోవీరికి ప్రయాసలుకలుగును— జైయిలులో వీరికి ప్రత్యేకయేర్పాటులను చేయవలసివస్తుంది కనుక జబ్బుగానున్నవారు సత్యాగ్రహంచేయ కూడదు మీకుజబ్బుగావున్నదిగనుక మీరుసత్యాగ్రహంచేయ్యవద్దు మీరు వెంటనే సేవాగ్రామం రావలెను మీకక్కడ బాగుగాచికిత్స, ఉపచారంకూడా జరుగును" అని గాంధిమహాత్ముడు డాక్టరుసయ్యదుమహమ్మదుగారికివ్రాసిరి

## ఉద్యోగమునకు రాజీనామా

చిత్తూరుజిల్లాబోర్డు హైస్కూలులో వ్యాయామోపాధ్యాయులు శ్రీ సి. సీతారామయ్య గారు కాంగ్రెసుఆదేశమనుసరించి సత్యాగ్రహముచేయనిశ్చయించి తనఉపాధ్యాయపదవికి హెడ్ మాస్టర్ ద్వారా జిల్లాబోర్డుప్రెసిడెంటుగారికి ౩ రోజుల క్రిందట రాజీనామాపంపిరి—

గతమాసములో ఒకదఫాసత్యాగ్రహముచేసి యరెస్టుగాబడిన విడుదలకాబడిన శ్రీ నారాయణస్వామిచెట్టియారుగారు మరల చెన్నపట్నంలో [illegible] సత్యాగ్రహముచేసిరి కేసులో కొంతకాలముంచి రాత్రి ౫ గంటలకు వదలివేసిరి—

## ప్యారీలాల్ గారివిడుదల

నాగపూరు, మార్చి ౬

గాంధిమహాత్ముని కార్యదర్శులలోనొకరు, ఇటీవల కాంగ్రెసుసత్యాగ్రహ సందర్భములో శిక్షితుడైన ప్యారీలాల్ శర్మగారు అనుభవించవలసిన మూడుసెలలశిక్షకాలము పూర్తియైనందున, వారువిడుదలచేయబడిరి. వారువర్ధాకుపోయిరి.

# హైదరాబాదు యుద్ధనిధి

హైదరాబాదు (దక్కన్) మార్చి౹౫.

హైదరాబాదుయుద్ధనిధి కార్యనిర్వాహకవర్గము రైట్ ఆనరబిల్ సర్ అక్బర్ హైదరీగారి అధ్యక్షతన జేసినసమావేశమై లండనులోని లార్డు మేయరు నిధికిని, గ్రీసులోనియుద్ధానికి కావలసిన సహాయానికిని చెరియొక వేయిపౌనులనుపంపించుటకు తీర్మానించెను. కొద్దికాలంక్రింద ఈరెండు ఫండ్లకును చెరియొక వేయిపౌనులు పంపబడియుండెను. ఓవర్సీస్ లీగువారికొకటైన ౫౦౦ పౌనులు పంపించుటకు తీర్మానించబడినది—



# బెలుచిస్థానమునకు రాజ్యాంగ సంస్కరణ

## ముస్లింలీగువారి తీర్మానము ఓడుట ఢిల్లీ అసెంబ్లిలో చర్చఫలితము

క్రొత్తఢిల్లీ, మార్చి౹౫.

ఇక్కడఅసెంబ్లీసభలో నేడు ముస్లింలీగువారు బెలుచిస్థానమునకు రాజ్యాంగసంస్కరణ కావలెనని కోరుచు తీర్మానమును ప్రతిపాదించగా అది ఉదకుసభవారిచే నిరాకరించబడినది ౪౦ వోట్లు ప్రతికూలంగాను, ౧౭ వోట్లుఅనుకూలంగానువచ్చెను. కాంగ్రెసు నేషనలిస్టు పార్టీవారందరును ప్రభుత్వమునకే ఓట్లిచ్చిరి. కాంగ్రెసు పార్టీకిచెందిన యం ఏ బేజిమిగారు ముస్లింలీగునకు వోటిచ్చిరి కాంగ్రెసునేషనలిస్టుపార్టీవారగు యం.యస్. అనేగారుతీర్మానమునుగూర్చి ఉపన్యసించుచు బెలుచిస్థానంకంటె చిన్నప్రదేశంలో బాధ్యతాయుతప్రభుత్వమును ప్రవేశ్యపెట్టవీలగునాయనిరి. ఆప్రదేశంలో రూ ౩౦౦౦౦౦లు వార్షికాదాయమనియు, ఇప్పటికే రూ౧౩౫౦౦౦౦౦లు ఏటేట ఖర్చుఅగుచున్నదనియు, బాధ్యతాయుతప్రభుత్వముస్థాపించినచో ఇంకనుఖర్చు ఎక్కువకావలదనియు, అందుచేప్రజలపై పన్నులభారము హెచ్చునినియు చెప్పిరి.

# కెరోలురాజు తప్పించుకొని పారిపోవుట

రుమేనియాకు మొన్నమొన్నటివరకు రాజాగా నుండిన కెరోలు గారు తనఉంపుడుకత్తెయగు మ్యాడంలుపెస్కుతోకూడ స్పెయినుకుపారిపోయి అక్కడ సెవిల్ హోటల్ అను హోటలులో నుంటుండగా, అక్కడిపోలీసులు కాపలాకాయుచుండిరి. కెరోలుగారుఎన్నిరోజులు స్పెయినుదేశాన్ని వదలిపోవుటకై స్పెయిను ప్రభుత్వముయొక్క అనుజ్ఞను కోరుచుండిరి. కానిఅది దొరకలేదు. ఇట్లుండవారు మార్చి౧౪ తేదిన కాపలాయుండిన పోలీసులనుమోసం చేసి దొంగ ప్యాస్ పోర్టు (దేశమువదలుటకు ప్రభుత్వానుమతిపత్రము) చూపించి అతివేగంగామోటర్లో ఒకకారులోపోర్చుగల్లుకుతనఉంపుడుకత్తెయగు లుపెస్కుతో కూడపోయిరి,

# గ్రీసుకు జర్మనీబెదరింపులు

ఈడన్ గారు గ్రీసులో చేరి గ్రీసుప్రధానితోను, ఇతరమంత్రులతోను, గ్రీసు రాజాగారితోను, గ్రీసులోని బ్రిటిషు రాయబారితోను, అమెరికా, టర్కీల రాయబారులతోను మార్చి ౩వ తేదినుండి ౫వ తేదివరకు సంభాషణలుజరిపిరి ఈడన్ గారివెంటవచ్చిన బ్రిటిషుసర్వసేనాధిపతి సర్ జాన్ డిల్ గారు గ్రీసుసైనికాధికారులతోకూడ సంభాషించిరి. ఈ సంభాషణలన్నిటి ఫలితంగా బాల్కనుపరిస్థితిని గురించి బ్రిటిషుప్రభుత్వమునకును గ్రీసుప్రభుత్వమునకును సంపూర్ణమైన ఒడంబడిక కుదిరినట్లు ౫వ తేదిన ప్రకటనచేయబడినది. ౬వ తేదినాడు ఈడన్ గారును డిల్ గారును ఈజిప్టుకు వెళ్లిపోయిరి

గ్రీసుపైకూడ జర్మనీ తన్నుటకు ప్రారంభించినది. ఇప్పటికిని గ్రీసులో జర్మనురాయబారియున్నను. గ్రీసు బ్రిటిషుపక్షాన చేరినందువల్ల గ్రీసు,జర్మనీల సంబంధములు మంచివిగానున్నవని చెప్పవీలులేదు. ఒక జర్మనుఅధికారప్రకటన మార్చి౫వ తేదిన బర్లిను నగరములో విదేశీయపత్రికల ప్రతినిధులకీయబడినది

# తిరువాన్కూరు సంస్థానంలో విద్యావంతులు

## ఈసారి జనాభాలో ప్రతిశతి ౬౦కి హెచ్చుట

ఇంతవరకు జనాభాలెక్కలను మొదటిసారి జమచేయుట జరిగినది ఇంకనుపరిశీలించవలసియున్నది. ఇప్పటికే చూపగా తిరువాన్కూరు సంస్థానంలో మొత్తంజనంలో విద్యావంతుల సంఖ్య ప్రతిశతి ౪౭నుండి ౬౦కి హెచ్చినట్లు కనపడుచున్నది. మొత్తముజనసంఖ్య జరిగిన ౧౦ ఏండ్లలో ౫౧౦౦౦౦౦నుండి ౬౦౦౦౦౦౦కి హెచ్చినట్లు కనపడుచున్నది

# జర్మనుల బాంబులవల్ల బ్రిటిషునగరానికి అగ్నిస్నానము

బ్రిటనులో కార్డిఫ్ అనేనగరంపై మార్చినెల ౩వ తేది రాత్రి జర్మను విమానాలదాడిని మరుసాటిదయము ప్రభుత్వోద్యోగులు వర్ణించుచు "ఈయుద్ధంలో ఇంతవరకుజరిగిన గొప్పదాడులలో ఇదియొకటి" అని చెప్పిరి. పెద్ద కానిస్టేబిలు వర్ణించుచు "ఒక్కపెట్టున మరేపట్టణంమీదగాని అంతకంటెఎక్కువగా చిచ్చుబాంబులను వేసియుండరనుటకు సందేహము" అనిచెప్పిరి. చర్చిలు, చాలాఇళ్లు, కొన్ని అంగళ్లు సర్వనాశనమయ్యెను. ఒక ఆస్పత్రిపై బాంబులుపడినప్పుడు లోపల గాయాలైనవారలకు ఆపరేషనులుచేయబడుచుండెను. కాని ఎవరికిని గాయాలుకాలేదు.

## చొప్పదండి 'దొంగజనాభా'

కరీంనగరు నుండి హకీంమహమ్మద్ రూహుల్లాఖురేషీ అనువారు ఒక ఉత్తరాలేఖ నంపినారు. దానికి యాంతీకరణముచేయించి యిందు ప్రకటించుచున్నారు. గోలకొండపత్రికలో ౩౦ ఫర్వర్దివారు చొప్పదండిలో దొంగజనాభా అనుశీర్షికతో ప్రకటితమైనవార్తకు వీరుప్రత్యుత్తరమిచ్చుచు ఇట్లువ్రాసినారు.

(గమనిక.—అసలు విషయమును మాత్రమే అలంకారాదివర్ణన రహితంగా విలేఖకుడువ్రాసి నాతాగుండెడిది. తెలుగులో వ్రాయించినబాగుండెడిది. ఇదివరలోని విషయమునరియాకాదా అనునదిస్పష్టముచేయకపోయెను, విలేఖకులు సంక్షిప్తముగా విషయమునుగురించి మాత్రమేవ్రాసినచో మేము ప్రకటించగలము. గో. స.)

చొప్పదండి విలేఖరి చొప్పదండిలో మునల్మానులు అబద్ధముగాతమసంఖ్యను ఎక్కువగా చూపించుకొన్నారని వ్రాసినాడు. అతడు దుఃఖముతో పరితపించినాడు. దానినివిచారించుటకును ఆర్యమతవారిఆదరము హిందూజాతియొక్క అభిమానముపొందుటకును ప్రకటించినాడు. చొప్పదండిలో రఖ్బా ౩ లో ౨౧౫ ఇంటిలో మహమ్మదు ఇస్మాయిలు ఉన్నారు. వారియింటిలో పరిగణనకాలములో ౧౩ పేరులు వ్రాయించినారు, విలేఖకునివిచారణలో ౮ ఉండెనట. ఈ ఎక్కువసంఖ్యనువ్రాసిన గొంతుకొట్టదగిన పరిగణకు దెవ్వడుచూపించిన ఈచిత్రమింకనురంగు కెక్కెడిది.

ఈదొంగతనాన్ని పట్టినందుకు "జాతి"అంతయు చంకలెగురవేయుగలదు. ధర్మసంస్థాపనకై "అర్జునుడు" పునర్జన్మనెత్తవలెను.

దర్వేడులో వెంకటరెడ్డిఅను పోలీసు పటేలు పరిగణకుడుగాయుండెను, అతడు ౯౭ మందినిఎక్కువవ్రాసినాడు. మరియు భట్టు రంగయ్య ౭౫ మందినిఎక్కువవ్రాసినాడు. మాలిపటేలు నారాయణరావు ౧౦౫ మందినిపంపెను. వెంకటరావు మాలీపటేలు ౨౦ మందినిపంపెను. ఈనలుగురు పెంచినదానిలో చొప్పదండిలో పెరిగిన ౯ మంది మునల్మానుల హెచ్చునంఖ్యవచ్చినది. పవార్ మొహల్లాలో ౮ మునల్మానులను ధేడులలో వ్రాసినారు. హిందీరానివారు హిందీవచ్చునని వ్రాసినారు, ఒకనికిరెండింట్లుంటే రెంటిలోను తనవారిలెక్క వ్రాయించినారు. మాదిగవారిని విష్ణుమతములో చేర్చినారు. చిన్నకులాలవారిని బ్రాహ్మణులలో చేర్చినారు. ఇట్టివెన్నైనను నేను ఋజువుచేయగలను".

—

## ఆసిఫాబాదు

గోండులగోడు

(స్వ. వి.)

పోలిసులింతకుపూర్వము గోండులగోడునుగూర్చినవిషయములను గ్రహించియేయుందురు. తము పరిజర్గినవిషయములేవియు పత్రికాముఖమున కంఠించువారే అయినందువలన బహుశా పెక్కురకు తెలియకుండవచ్చును గోండులపైనేరారోపణగావింపబడి కొందరుగోండులు అరెస్టుగావింపబడి రిమాండ్ జేల్ లోనుంచబడిరి. కానికేసు సెషన్సులో కమిటిఅయినందువలన హన్మకొండ సెషన్సుజడ్జిగారేస్వయం ఆసిఫాబాద కరుదెంచికొందరకు విడదలాపత్రమును ప్రసాదించియుండిరి. ఆతరువాత తతిమ్మగోండులవిషయములో కార్యాయిజరిగినందులకు గానబక్కొక్క సంవత్సర పశిక్ష ప్రసాదింపబడియుండినను పైఅధికారులవారు దయాధర్మంభయాధర్తియన్నట్లు తక్కినవారిని కూడావదలవేసి దాదాపు ౧౫ రోజులుకొవచ్చినవి అందరుతమతమయిండ్లకువిచ్చేసినారు.

ఆసందర్భమున ముంతజమ్‌పోలీస్ నాయబ్జిల్లాఆదిలాబాదముస్తజక్ లో పర్కేర్‌పైనియమింపబడినారు.

— —

## జనపరిగణనము బలవంతముగవుర్దులో వ్రాయించుట

అత్మ్కపురం, ఫర్వర్ది-౨౮.

సిరిసిల్లాతాలుకలో హాల్కా గంభీరావుపేటగిర్దావరుమర్ధుంఘనూరి అంతావుర్దులోవ్రాయించటూని షుమారు కునిందాలనుబాధించెను. షుమారుకునిందాలందరు క్షైత్యులైయుండిరి. వారికివుర్దురాదు వుర్దురానందున తెలుగులోవ్రాసిరి. తెలుగుపేర్లుకొట్టించి వుర్దులో వ్రాయించిరి అయ్యామాకువుర్దురాదని మహారుకునిందాలు మొరపెట్టుకొంరి గిర్దావరుగారొక వుపాయము చెప్పెనదెడి. బడిపిల్లలలోకొందరు తురకలచేరివారికి ప్రతిషుమారుకునిందా ఒకరూపాయియిచ్చి వ్రాయించిరి వ్రాసేవారికి తెలుగురాదు, చెప్పేవారికివుర్దురాదు. తల్లకిందులవ్రాతలుగూడ జరిగినవి గిర్దావరుగారి వింతచర్యలకు క్షైత్యులుఆశ్చర్యపడిరి ఏమితోచక దక్షిణచెల్లించి ఒడిపిల్లలచేవ్రాయించుకొనిరి.

సిరిపిల్ల ఆర్యసమాజము

శ్రీసత్యకుమారుసిద్ధాంతరత్న ఆర్యసమాజప్రచారకులుశాంతముగా పట్టుదలతోపనిచేయుచున్నారు. స్థానిక నాయకులు విద్యావంతులు వకీల్లు ఎవరునుశ్రద్ధతీసుకొనుటలేరు. ప్రతిశుక్రవారము సత్సంగము నవయువకులకు ప్రోత్సాహము కలుగజేయుచున్నారు ఆచిరకాలములో నరేంద్రజీ గారివాక్యవిందు ఆర్యసమాజము స్థాపించబూనినారు నవయువకులుఅత్యుత్సాహముతో సర్వలోపాల్గొని తమవిశ్వాసమును తెలుపుచున్నారు.

ఇట్లు

యస్. భూపతిరెడ్డి

—

## మోటర్ ప్రమాదం డ్రైవర్ మరణం

[స్వ.వి.]మహబూబునగర్ ౯-౨-[illegible]

ఖాజామెటారుఖాన్ది కొత్తకోటనుండి మహబూబునగరమునకు ప్యాసింజర్లను తీసుకొని వచ్చుచుండగా రాజనగరమునుండి వనపర్తికోటలోనికి డీకొని ఒకడ్రైవరు చనిపోయినాడు. క్లీనర్ కు గాయములైనవి. ప్యాసింజర్లకు అపాయకరమైనదెబ్బలుతగిలినవి ఈదుర్ఘటనపేటఉదయం ౧౦గం॥ లకుజరిగినది. రైలుకేవెళ్ళువారు, పోలీసుశాఖవారు, ప్రజలుచూచుటకు వెళ్లిరి, గాయములుతగిలినవారినిఆస్పటాలుకు తెచ్చు ఏర్పాట్లుచేసినారు.

—

## మెదకు

బస్సుకండక్టరు కొట్టబడుట

(స్వ-వి)

రెండవఅర్ది బెహ్మన్తేదినాడు సాయంకాలం మెదకునుండి వట్టిగూరంస్టేషనుకువెళ్ళు నెం.౧౧ బస్సుకండక్టరు [illegible]కర్ని గారిని, మెదకు జాగీరుదారుమ్మైన మ.అహమద్ పాషా గారును వారి అనుచరులును కొట్టిరి. అందుకుకారణము ఏమనగా, బస్సు బయలుదేరుటకుపూర్వమే పూర్తిగా నిండిపోవుటచే గాక నిలుచుండుటకైనను అందులో స్థలములేక క్రిక్కిరిసియుండెను. కండక్టరు నిలుచుండిఉన్నవారిని ఎక్కనిచ్చుటకుగూడా వీలులేకుండెను. పైన ఇంకాకొందరు ఎక్కవలసియుండిరి. వారిని కండక్టరువారించెను. అంతగా వాగ్వాదము ప్రారంభముకాగా ప్యాసింజరులలో ఒకరుగా యుండిన అహమద్ పాషా గారు, కండక్టరునుకొట్టిరి. అతని అనుచరులుగూడాకొట్టిరి. పైగాజాగీరుదారుగారుబస్సుదిగి బస్సులోనివారినందరిని దింపిరి. ఇంతలో ఈసంగతి బస్సుయిన్స్పెక్టరు గారికి తెలుపబడగా వారువచ్చివిరములు తెలుసుకొని కొట్టినవారిపైగాకని, వారిఅనుచరులన్నబహిరంగముగా బస్సులో ఎక్కించిపంపిరి. అసలు యిన్స్పెక్టరు విషయము పై రిపోర్టుచేయుటకే ఇష్టపడలేదు. బలవంతము మీద రిపోర్టుచేశారట. కాని యింతవరకుఫలితం శూన్యం.

రోహిలా యువకుని హత్య

నాంపల్లిలోజాలకింద అబ్దుల్రహిమాన్ అను యువకుని మెదకుఆస్పత్రికి చేర్చిరి. అతని శరీరముపై గాయములుండెను. హత్తిదుప్పులో చుపాకిదెబ్బవల్ల పేగులుచింతగవంకపై బయటపడినవి. అతనికిప్రథమచికిత్సజరిపి హైదరాబాదుయుస్మానియా వైద్యశాలకుపంపిరి. అతడు అక్కడచనిపోయినాడని తెలియుచున్నది. హత్యకు కారణమిట్టిదనిఇంకను చెప్పబడుచున్నది. మెదకులో శేషహాండ్యగోవిందరావుఅనునతడుగలడు. దానికిని మనూరునివాసియగు మాతిక్యారావుగారికిని చిరకాలమునుండిబద్ధవైరమట-కత్తి క్రసాములలో ప్రవీణుడైన అబ్దుల్రహిమాన్ను గోవిందరావుగారు తనవద్ద నౌకరీకి కుదుర్చుకున్నారు ఆస్వామికార్యమునకే అనమ్మకమైనబంటు తననిండుప్రాణములను బలియిచ్చినట్లు తెలియుచున్నది. పోలీసు విచారణ జరుగుచున్నది.

# దేశంలో ఆవుపాల కఱవు

## తొలగించుటకై ఒక విధానము

పాలిచ్చు ఆవులను చంపకుండ శాసించవలెనను సూచన

దేశంలో పాలిచ్చే ఆవులను చంపివేయుచున్నందువలన, పిల్లలకు ఎదిగే ఈడులో పాలు దొరకక శిశు మరణాల సంఖ్య ఎక్కువగుచున్నది. కాబట్టి ఆవులను చంపకుండ వాటికి మంచిమేతనిచ్చే యేర్పాటు చేయుటకు ప్రయత్నించుచున్న భారతీయ గోరక్షాప్రచారక సంఘమునకు దేశీయులు సహాయపడవలసినదని పండిత మాలవ్యాగారొక దీర్ఘవిజ్ఞప్తిని చేసినారు. ఆవిజ్ఞప్తిలో వారీక్రింది విధముగా వివరణచేసినారు.

"భారత దేశంలో అంతటను హిందువులు ఆవును పూజింతురు. అట్టిదేశంలో ఇపుడు ఉండే పరిపాలనలో ఆవులను వధ్యశాలకంపుచున్నారు. ఇట్లు చాల కాలంనుండి జరుగుచున్నందువల్ల చాలాఆవులు నష్టమైపోయినవి. కలకత్తాలో పోయినసంవత్సరము ఒకలక్ష ఆవులు ఎద్దులు, బఱ్ఱెలు చంపబడెను. బొంబాయిలోను బొంబాయి సమీపమందును ఇటీవలనే ఒక సంవత్సరంలో ఆరువేల ఆవులు చంపివేయబడినవి.

"ఇట్లు చంపబడిన ఆవులుపోగా ఇంకను అనేకములైన ఆవులను హరియానా మున్నగు చోట్లనుండి బయటిదేశాలకు పంపించినారు, పోయిన మూడేండ్లలో రాజపుత్రస్థానములోను, ఆసమీప ప్రదేశమందును అనేకములైన అవులు క్షామమువల్ల నశించినవి. ఇందువల్ల హిందువులు, సిక్కులు, ముసల్మానులు, క్రైస్తవులు మున్నగుభారతీయుల శిశువులకు కావలసినంత పాలు లభించక శిశుమరణాలసంఖ్య హెచ్చినది.

"పాలుచాలనందుకు నాలుగు పెద్దకారణములున్నవి: (౧) పాలిచ్చు పశువులను వధ్యశాలకంపి చంపివేయుట, (౨) మంచిఆబోతులు తక్కువగానుండుట, (౩) పెద్దపట్టణాల వెలుపల పాలుతీసే ఏర్పాట్లు లేకుండుట, (౪) మేతకు చాలినంత బీడు లేకుండుట.

"బొంబాయిప్రభుత్వమువారు నియోగించిన పశుశాస్త్రప్రవీణ సంఘమువారు పెద్దపెద్దపట్టణములలో పాలిచ్చే ఆవులనుచంపకుండ శాసనము చేయవలెనని సలహానిచ్చినారు. ఈసలహామంచిదని చెప్పి ప్రభుత్వమువారికిని, పురపాలక సంఘాలకు, జిల్లాబోర్డులకును, ఇతరసంస్థలకును మాలించుచున్నాను. ఆసంస్థలును, వ్యక్తులును కలిసి పెద్దనగరాల వెలుపల పాలుతీసే ఏర్పాట్లు చేయించవలెను. ప్రభుత్వము, ప్రజాసంస్థలు, వ్యక్తులు కలిసిపనిచేసినచో దేశమంతటను శుద్ధమైనపాలు లభించగలవు. ఆవులనుకూడ చంపబడకుండును నగరాలలోని బాలలకు నానాబాధలు పడకుండాను కాపాడవచ్చును.

"దేశమంతటను ౧౫౦౦గోశాలలు, క్షీరశాలలున్నవనియు, ౧౫లక్షలరూపాయిలు వాటికై ప్రతియేట ఖర్చు అగుచున్నవనియు చెప్పుదురు. ఈగోశాల లన్నియు ఒకటిగా కలసి పనిచేసినచో ప్రజలకు వాటిలోనుండి శుద్ధమైనపాలు లభించుటయేగాక ఆవులుకూడ రక్షితములగును. గోశాలలులేనిచోట్లలో వాటిని సాధ్యమైనంత త్వరలో స్థాపించవలెను.

"ఇందుకై భారతదేశానికంతటికిని ఒకకేంద్ర సంస్థను స్థాపించవలెనని యున్నది ఈసంస్థ ఆ సోసియేషనుయొక్క ఉద్దేశ్యమునుగూర్చి ప్రచారము చేయుటకై విశేషంగా పాటుపడగలదు. ఉద్దేశ్య మేమనగా శుద్ధమైన ఆవుపాలు సమృద్ధిగాలభించునట్లు చేయుటఒకటి, ఆవులనుచంపకుండా చేయుట రెండవది............

"ఇందుకై పూనాలోను, బొంబాయిలోను, డైలోను ఒకపద్ధతిని బొంబాయిలోని గోరక్షణసంఘవారు శ్రీచెండేజి మహారాజాగారు దర్శకత్వమున ఆచరణచేసి చూచియున్నారు. వీరకేంపీ ఫ్లాట్లో గోశాల చేయుచున్నారు ఆసంఘవారు పచ్చికబీళ్లనుంచి, ఎండినఆవులను బీళ్లకుపంపి, మరల పాలుపట్టగానే యజమానులకడకు పంపుచున్నారు. ఇందుకుగాను ఆవుల యజమానులు కొంతరుసుము చెల్లింతురు.

"చెండేజీగారు దేశమంతటను సంచారముచేసి ఈప్రణాళికను వ్యాపింపజేయవలెనని నేనుకోరితిని, అందుకువారంగీకరించినారు. ఈవిషయంలో ప్రజలు వారికితోడ్పడవలెనని నాప్రార్థన ఆవు మతభేదమును పాలించక ఎవరికంటేవారికి పాలిచ్చునుగనుక ప్రతిమతపువారును గోసంరక్షణకు తోడ్పడగలరని నేనాశించుచున్నాను, మనము ఆవుకుసహాయపడినచో, అవు మనకుసహాయపడగలదు."

---

# హిందువుల ప్రాచీనరాజ్య విస్తరణము

రఘునాథ్ భయంకరాచార్యగారు

ఆంగ్లేయులు హిందూదేశమును ఖండఖండములుగా విభజించి పరిపాలన జరిపినప్పటికి ధర్మము భాష, సంస్కృతిని సంబంధించిన ఇతివృత్తములను మాత్రము వేరుపరచలేదు.

మలయాద్వీప కల్పము భారతదేశముయొక్క ముఖ్యభాగముగా యుండెను, కీవిని క్రీ॥శ॥ ౧౮౨౪సం॥లో ఇంగ్లీషువారు భారతదేశమునుండి విడదీసినారు. అందు క్రీస్తుశకము పూర్వమున (అనగా ౭౦౦ B-C) కళింగుల ప్రాచీనరాజ్య స్థాపన జరిగెను. భారతదేశమునకు తూర్పుసముద్రపు టొడ్డున కళింగమనురాజ్యముండెను. దానియొక్క రాజధాని సింగపురము, కళింగులు సముద్రవ్యాపారమున ఆరితేరినవారై యుండిరి. వారిలో మిక్కిలి సాహసముగల నాయకులుకూడ యుండిరి. సముద్ర వ్యాపారముల కొరకై మలయాద్వీపకల్పమునకు వెళ్లుచుండినట్లు నిదర్శనములున్నవి, ప్రథమశతాబ్దమున లంకాసుక అనుపేరుగల భారతీయరాజ్యముండెను ధర్మశాస్త్రము మరియు కింవదంతుల సంబంధము ఈరాజ్యమునకే జరిగినది. మలయాయందు రెండవప్రసిద్ధ భారతరాజ్యము శ్రీవిజయునిచే పరిపాలన చేయబడినది ఎనిమిదవ శతాబ్దమున శశ్శేంద్రచక్రవర్తిచే పరిపాలింపబడెను, అతడు "ద్వీపాధీశ్వరుడని" పిలువబడెను దక్షిణభారతీయులచే లిఖింపబడిన శిలాశాసనములు బౌద్ధస్తూపములు, హిందూ మందిరములు ఎన్నోయున్నవి. మలయాయొక్క సైన్యము నేడు పోర్టుడైవాంగోయందున్నది. పూర్వమున సింగపూరుమందే రాజమందిరములుండెను అచ్చట అనేక స్వర్ణభూషణములు లభించినవి. నేడు యుద్ధసైన్యము చాలావరకు సింగపూర్ లో నేయున్నది ఈసింగపురమును క్రీ॥శ॥ ౧౮౧౯ సం॥లో స్టాఫర్డ్ రఫల్ అనునతడు కనిపెట్టి ఆంగ్లేయులకు తెల్పెను. నాటినుండి నేటివరకు నిది ఆంగ్లేయులచే పరిపాలింపబడుచున్నది.

విన్-బి-సాల్వన్ అను ఫ్రెంచివిద్వాంసుడు "భారతీయులు" అనుగ్రంథములో ఏమివ్రాసిరో చూడుడు:—

"నేనుభారతీయుల నాగరికచరిత్ర కాలగర్భమున పడిపోయినను వారి క్రియాకౌశలమువిచిత్రము అపారము. నాగరికవిషయమున ఆగరరాష్ట్రగల ఆంగ్లేయులు భారతీయులనుండి ఎన్నోసూత్రములు గ్రహించి ఉపయోగించుకొని యున్నారు."

---

